ఉ. సాంద్రయశోరమావిభవ సత్యవచోమణిహార యోహరి
శ్చంద్రనరేంద్ర వంశవనచైత్ర యమిత్రజయప్రతాపని
స్తంద్ర పురందరాదివిబుధవ్రజరంజితపట్టభద్ర భో
గీంద్రున కైన శక్య మగునే నుతియింప భవత్ప్రభావముల్. 283

మ. అనఘుం డైనవసిష్ఠుతో నొఱసి లోకాశ్చర్యదుర్గ్యంబు గా
దనయక్షీణతపోవిశేషగరిమ న్దర్పించి బ్రహ్మర్షియై
వినుతిం బొందినవేదమూర్తి త్రిజగద్విఖ్యాతుఁ డగ్గాధినం
దనుఁ డెంతే వెఱఁగంద నిల్పితివి నిత్యం బైనసత్యం బిలన్. 284

తే. మహిమతో నింకఁ బూజ్యసామ్రాజ్యలక్ష్మి, వెలయఁ గైకొని భూప్రజావితతిఁ బ్రోవ
వేగ విచ్చేయుఁ డని విన్నవించుటయును, హర్ష మొదవంగ దరహాసితాస్యుఁడగుచు.

చ. సముచితవాగ్విశేషముల సంతస మొందఁగ సత్యకీర్తి ను
త్తమసచివాగ్రణి న్నిజహితస్థిరకార్యరహస్యవేది దు
ర్విమతసమూహసంహరణవిక్రమునిం దగ నాదరించి ర
త్నమయవినూత్నకాంచనరథంబు ముదంబున నెక్కె నున్నతిన్. 286

సీ. అమలంబు లగుచతురంగబలంబులు గరిమ దీపించి నల్గడలఁ గొలువ
హృద్యంబులై బహువాద్యరవంబులు మ్రోయ మాగధగానములు చెలంగ
వందిబృందములు కైవారము ల్గావింపఁ జేరి పుణ్యస్త్రీలు సేస లిడఁగఁ
గంకణఝణఝణత్కారము ల్చెలరేగ రమణులు వింజామరములు వీవఁ
గలికికన్నులవారకాంతలు పసిండి, పళ్లెరంబుల రత్నదీపములు నించి
నిండువేడ్క నివాళింప నిజపురంబు, మంచిశుభలగ్నమునఁ బ్రవేశించె నృపతి. 287

వ. ఇవ్విధంబునం బురంబుం బ్రవేశించి రాజమార్గంబునం జనుదెంచునప్పుడు. 288

సీ. అరవిందనాభుఁ డీయవనీతలేశ్వరుఁ డిందిర యీశరదిందువదన
పాకశాసనుఁ డీదివాకరాన్వయభర్త పౌలోమి యీపురంధ్రీలలామ
నీహారకిరణుఁ డీనిత్యసత్యధనుండు రోహిణి యీపంకరుహదళాక్షి
ప్రసవకోదండుఁ డీరాజదేవేంద్రుండు రతిదేవి యీలోకనుతచరిత్ర
యని హరిశ్చంద్రసార్వభౌమాగ్రగణ్యుఁ, జంద్రమతిఁ జూచి యానందజలధిఁ దేలి
పౌరజనబృందములు సుధాసారమధుర, చిత్రవాగ్వైఖరులఁ బ్రశంసించి రలమి.

వ. ఇవ్విధంబునం బౌరజననికాయసంస్తూయమానుండై హరిశ్చంద్రుండు మహానందంబు
ను బొంది నిజమందిరంబుం దఱిసి సముచితవర్తనంబునం బ్రవర్తించుచు నయమార్గం
బునం బ్రజాపరిపాలనశీలుండై స్వారాజ్యం బగురాజ్యంబు సేయుచుండె నని. 24